## బాలురకు ప్రశ్న లెక్కలు.

1. ఓబాలురలారా టెంకాయచెట్లు ౧కి-కాయలు ౧౬ వంతున ౨౧ చెట్లకు కాయలు మొత్తమెంత జెప్పుము-ఉదాహరణము.

2. ఓబాలురలారా ఒకమనిషికి ఒక దినమునకు కూలి ౨ అణా ౮ పైవంతున ౧౯ మనుష్యులకు కూలి మొత్తమెంత జెప్పుము.

3. ఓబాలురలారా దినము ౧కి ఒకమనిషికి కూలి ౩అ ౧౦పైసలవంతున ౨౧ రూ ౬అ ఎన్నిమనుష్యులకు కూలియివ్వవచ్చును చెప్పుము.

4. ఓబాలురలారా ఒకజాంపండులోపల విత్తులు ౬౪ వుండినయెడల ౨౭ పండ్లకు విత్తులు మొత్తమెంత చెప్పుము.

5. ఓబాలురలారా మామిడిపండ్లు నూరు వెలి ౬ అ. ౮పై. వెలఐతే ౧౫౫౦ పండ్లకు క్రయమెంత మొత్తంచెప్పుము.

6. ఓబాలురలారా ఒకడికి జేజమ్మ యిచ్చినది ౩అణ. ౧౧పై. అవ్వయిచ్చి[illegible] .౮.పై.

తాతయిచ్చినది ౧ అ. ౯ పై. తండ్రియిచ్చినది ౨ అ-౬ పై తల్లియిచ్చినది. ౫ అ- ౯ పై. అంతా మొత్తమెంత చెప్పుము.

7- ఓబాలులారా ఒకముత్యాలసరము ౧కి ౭౨ ముత్యములు వుండినయెడల ౨౩౯ సరములకు యెన్నిముత్యములు చెప్పుము.

8, ఓబాలులారా ౩౦ వ్వ. ౧౪అ- ౧౨ మనుష్యులకుయివ్వాను ఒకమనిషి౧కి- ఎంత మొత్తం

9. మంచిపగడముల కుచ్చు ౧కి ౨వ్వ-౬ అ- ౯- పై- ధరవలె ౧౭౯ కుచ్చులకు మొత్తమెంత-

10- ఓ బా అరటిపండ్లుగెల ౧కి ౪౩౯ పండ్లు వుండినయెడల ౭౬ గెలలకు పండ్లు మొత్తమెంత

11- ఓబాలులారా ఒకమామిడిచెట్టులో మామిడిఆకు ౧౧౭౨ కాయలు ౯౬౩ పండ్లు ౬౩౯- ౨౩ చెట్లకు ఆకులెన్ని కాయలెన్ని పండ్లెన్ని.

12- ౨అడుగుల కొట్టడిఖుంటికి ౨౯౩౯ పెంకులు పైకప్పుఉండినయెడల ౨౪ కొట్టళ్లకు ఎన్ని పెంకులుకావలయును మొత్తంచెప్పుము.

13- ఓబాలలారా ౩౨ప్ప. ౫౪ మనుష్యులకు ఇచ్చినయెడల మనిషి ౧కి భాగమెంత-

14- ఓ బా రా పంచిబెల్లంవీసె ౮కి ౨అ-౬పై- ధరఐతే ౧౩౪ వీసెలకు ధరఎంత ౧పలం ఏమివెల-

15- ఓబాబెంకాయ౧౦౦కి౪ప్ప ౬ అ- ౩పై- వెలఐతే౧౪౩౯ కాయలకుధరఎంత-

16- అడుగు ౧కి-చదురానికి చదురము ౧౨ రాళ్లుఅయితే ౫౪౩౯ చదరఅడుగులకుయెన్ని రాళ్లు కావలయును చెప్పుము-

17- మల్లె పూలు ఒకపడి ౧కి ౨ అ-౮ పైధర ఐతే ౪౫౦ పళ్లకు ధరయెంత-

18 ఒకపడిబియ్యము ౨ అ ౬ పై- వెల యైతే ౫౩ రూపాయలకుయెన్నిపళ్లుకొనవచ్చును

19- ఒకగుమ్మడిపండులో ౪౩౭ విత్తులువుండిన యెడల ౩౯ పండ్లకు యెన్నివిత్తులువుండును

20- ఒకసేరు ౧కి రాగి ౪ అ - ౧పై-వెలయైతే ౫౩ సేరులకు ధరయెంత ౨౩ రూపాయలకుయెన్ని సేరుకొనవచ్చును చెప్పుము-

21. ఒకపరిభువునకు ౧౨౦౦౦ రూ- ఆస్తివుండిన ఎడల ఒకకూతురుపెండ్లికి ౩౩౨ రూ- సెలవుచేసి మరియొకకూతిరికి ౬౮౪ రూ- సెలవుచేసితనకు కొమాళులు ౯ మందికికొడుకు ౧కి ఎంతభాగం-

22. బిడ్డలారా ౪౫ రూ- యలకు పైసలుయెన్ని కాలణాలుయెన్ని అర్ధణాలుయెన్ని అణాలుయెన్ని ౯౮౪౩౭ అణాలకురూపాయలుయెన్ని-

23. మీతాతనీవద్ద ౫ రూ-౧౩అ-ఇచ్చికలకండ ౧దు- ౩అ ద్రాక్షపండు ౨దు ౫అ- ౪పై - ముంత వరామిడిపప్పు ౧దు - ౧౪అ - ౧౧పై - తీసుకొని రమ్మనినఎడలమిగత నీవద్దవుండవలసినది ఎంత-

24. ఓబిడ్డలారా పొగబండి అణా౧కి ౬ మెళ్లు పోతే ౨కు - ౧౩ అ- ౯పై ఎన్ని మెళ్లుపోవచ్చును-

25. పొగబండి ౧ ఘంటకు ౨౫ మైళ్లుపోతే ౬౩¼ ఘంటలకుయెన్ని మైళ్లుపోవచ్చును-

26. ఒకసవరను ౧కి ౨। వరాఎత్తు ౧౫రు- ౯అ ౩పై- వంతునవరాఎత్తు ౧కి గురిగింజలు ౩౨ వంతున ౧ వరాయెత్తు ౯ గురిగింజలకుధరయెంత-

| బారువ ౧కి ధర | మణుగు ౧కి ధర మొత్తం. | | | వీసె ౧కి ధర మొత్తం. | | | రతి ౧కి ధర మొత్తం. | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| వరాలు. | రూ- | అ- | పై- | రూ- | అ- | పై- | రూ- | అ- | పై- |
| ౧౦౦ | ౧౭ | ౮ | ౦ | ౨ | ౩ | ౦ | ౦ | ౧౧ | ౩ |
| ౯౫ | ౧౬ | ౧౦ | ౦ | ౨ | ౧ | ౩ | ౦ | ౧౦ | ౭ |
| ౯౦ | ౧౫ | ౧౨ | ౦ | ౧ | ౧౫ | ౬ | ౦ | ౧౦ | ౧ |
| ౮౫ | ౧౪ | ౧౪ | ౦ | ౧ | ౧౩ | ౯ | ౦ | ౯ | ౬ |
| ౮౦ | ౧౪ | ౦ | ౦ | ౧ | ౧౨ | ౦ | ౦ | ౯ | ౦ |
| ౭౫ | ౧౩ | ౨ | ౦ | ౧ | ౧౦ | ౩ | ౦ | ౮ | ౫ |
| ౭౦ | ౧౨ | ౪ | ౦ | ౧ | ౮ | ౬ | ౦ | ౭ | ౧౦ |
| ౬౫ | ౧౧ | ౬ | ౦ | ౧ | ౬ | ౯ | ౦ | ౭ | ౩ |
| ౬౦ | ౧౦ | ౮ | ౦ | ౧ | ౫ | ౦ | ౦ | ౬ | ౯ |
| ౫౫ | ౯ | ౧౦ | ౦ | ౧ | ౩ | ౩ | ౦ | ౬ | ౨ |
| ౫౦ | ౮ | ౧౨ | ౦ | ౧ | ౧ | ౬ | ౦ | ౫ | ౭ |
| ౪౫ | ౭ | ౧౪ | ౦ | ౦ | ౧౫ | ౯ | ౦ | ౫ | ౦ |
| ౪౦ | ౭ | ౦ | ౦ | ౦ | ౧౪ | ౦ | ౦ | ౪ | ౬ |
| ౩౫ | ౬ | ౨ | ౦ | ౦ | ౧౨ | ౩ | ౦ | ౩ | ౧౧ |
| ౩౦ | ౫ | ౪ | ౦ | ౦ | ౧౦ | ౬ | ౦ | ౩ | ౪ |
| ౨౫ | ౪ | ౬ | ౦ | ౦ | ౮ | ౯ | ౦ | ౨ | ౧౦ |
| ౨౦ | ౩ | ౮ | ౦ | ౦ | ౭ | ౦ | ౦ | ౨ | ౩ |
| ౧౫ | ౨ | ౧౦ | ౦ | ౦ | ౫ | ౩ | ౦ | ౧ | ౮ |
| ౧౦ | ౧ | ౧౨ | ౦ | ౦ | ౩ | ౬ | ౦ | ౧ | ౧ |
| ౯ | ౧ | ౯ | ౨ | ౦ | ౩ | ౨ | ౦ | ౧ | ౦ |
| ౮ | ౧ | ౬ | ౫ | ౦ | ౨ | ౧౦ | ౦ | ౦ | ౧౧ |
| ౭ | ౧ | ౩ | ౭ | ౦ | ౨ | ౪ | ౦ | ౦ | ౯ |
| ౬ | ౧ | ౦ | ౧౦ | ౦ | ౨ | ౧ | ౦ | ౦ | ౮ |
| ౫ | ౦ | ౧౪ | ౦ | ౦ | ౧ | ౯ | ౦ | ౦ | ౭ |
| ౪ | ౦ | ౧౧ | ౨ | ౦ | ౧ | ౫ | ౦ | ౦ | ౫ |

| బాడువ ౧కి ధర | మణుగు ౧కి ధర ఎంత- | | | వీసె ౧కి ధర ఎంత- | | | రతి ౧కి ధర ఎంత- | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| రూపా | రు- | అ- | పై | రు- | అ- | పై | రు- | అ- | పై |
| ౧౦౦ | ౫ | ౦ | ౦ | ౦ | ౧౦ | ౦ | ౦ | ౩ | ౩ |
| ౯౫ | ౪ | ౧౨ | ౦ | ౦ | ౯ | ౬ | ౦ | ౩ | ౧ |
| ౯౦ | ౪ | ౮ | ౦ | ౦ | ౯ | ౦ | ౦ | ౨ | ౧౧ |
| ౮౫ | ౪ | ౪ | ౦ | ౦ | ౮ | ౬ | ౦ | ౨ | ౯ |
| ౮౦ | ౪ | ౦ | ౦ | ౦ | ౮ | ౦ | ౦ | ౨ | ౭ |
| ౭౫ | ౪ | ౧౨ | ౦ | ౦ | ౭ | ౬ | ౦ | ౨ | ౫ |
| ౭౦ | ౩ | ౮ | ౦ | ౦ | ౭ | ౦ | ౦ | ౨ | ౩ |
| ౬౫ | ౩ | ౪ | ౦ | ౦ | ౬ | ౬ | ౦ | ౨ | ౧ |
| ౬౦ | ౩ | ౦ | ౦ | ౦ | ౬ | ౦ | ౦ | ౧ | ౧౧ |
| ౫౫ | ౨ | ౧౨ | ౦ | ౦ | ౫ | ౬ | ౦ | ౧ | ౯ |
| ౫౦ | ౨ | ౮ | ౦ | ౦ | ౫ | ౦ | ౦ | ౧ | ౭ |
| ౪౫ | ౨ | ౪ | ౦ | ౦ | ౪ | ౬ | ౦ | ౧ | ౫ |
| ౪౦ | ౨ | ౦ | ౦ | ౦ | ౪ | ౦ | ౦ | ౧ | ౩ |
| ౩౫ | ౧ | ౧౨ | ౦ | ౦ | ౩ | ౬ | ౦ | ౧ | ౧ |
| ౩౦ | ౧ | ౮ | ౦ | ౦ | ౩ | ౦ | ౦ | ౧ | ౦ |
| ౨౫ | ౧ | ౪ | ౦ | ౦ | ౨ | ౬ | ౦ | ౧ | ౧౦ |
| ౨౦ | ౧ | ౦ | ౦ | ౦ | ౨ | ౦ | ౦ | ౦ | ౮ |
| ౧౯ | ౦ | ౧౫ | ౨ | ౦ | ౧ | ౧౧ | ౦ | ౦ | ౭ |
| ౧౮ | ౦ | ౧౪ | ౫ | ౦ | ౧ | ౧౦ | ౦ | ౦ | ౭ |
| ౧౭ | ౦ | ౧౩ | ౭ | ౦ | ౧ | ౮ | ౦ | ౦ | ౭ |
| ౧౬ | ౦ | ౧౨ | ౧౦ | ౦ | ౧ | ౭ | ౦ | ౦ | ౬ |
| ౧౫ | ౦ | ౧౨ | ౦ | ౦ | ౧ | ౬ | ౦ | ౦ | ౬ |
| ౧౪ | ౦ | ౧౧ | ౨ | ౦ | ౧ | ౫ | ౦ | ౦ | ౫ |
| ౧౩ | ౦ | ౧౦ | ౫ | ౦ | ౧ | ౪ | ౦ | ౦ | ౫ |
| ౧౨ | ౦ | ౯ | ౭ | ౦ | ౧ | ౨ | ౦ | ౦ | ౪ |

| నెల ౧కి | దినసంబళవివరము. ౨౮ తేదికి | | | ౩౦ తేదికి | | | ౩౧ తేదికి | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| రు | రు. | అ. | పై. | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
| ౧ | ౦ | ౦ | ౭ | ౦ | ౦ | ౬ | ౦ | ౦ | ౬ |
| ౧½ | ౦ | ౦ | ౧౦ | ౦ | ౦ | ౧౦ | ౦ | ౦ | ౯ |
| ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౧ | ౦ | ౧ | ౦ |
| ౨½ | ౦ | ౧ | ౫ | ౦ | ౧ | ౪ | ౦ | ౧ | ౩ |
| ౩ | ౦ | ౧ | ౯ | ౦ | ౧ | ౭ | ౦ | ౧ | ౭ |
| ౩½ | ౦ | ౨ | ౦ | ౦ | ౧ | ౧౦ | ౦ | ౧ | ౧౦ |
| ౪ | ౦ | ౨ | ౩ | ౦ | ౨ | ౨ | ౦ | ౨ | ౧ |
| ౪½ | ౦ | ౨ | ౭ | ౦ | ౨ | ౫ | ౦ | ౨ | ౪ |
| ౫ | ౦ | ౨ | ౧౦ | ౦ | ౨ | ౮ | ౦ | ౨ | ౭ |
| ౫½ | ౦ | ౩ | ౨ | ౦ | ౨ | ౧౧ | ౦ | ౨ | ౧౦ |
| ౬ | ౦ | ౩ | ౫ | ౦ | ౩ | ౨ | ౦ | ౩ | ౧ |
| ౬½ | ౦ | ౩ | ౯ | ౦ | ౩ | ౬ | ౦ | ౩ | ౪ |
| ౭ | ౦ | ౪ | ౦ | ౦ | ౩ | ౯ | ౦ | ౩ | ౭ |
| ౭½ | ౦ | ౪ | ౩ | ౦ | ౪ | ౦ | ౦ | ౩ | ౧౦ |
| ౮ | ౦ | ౪ | ౭ | ౦ | ౪ | ౩ | ౦ | ౪ | ౨ |
| ౮½ | ౦ | ౪ | ౧౦ | ౦ | ౪ | ౬ | ౦ | ౪ | ౫ |
| ౯ | ౦ | ౫ | ౨ | ౦ | ౪ | ౧౦ | ౦ | ౪ | ౮ |
| ౧౦ | ౦ | ౫ | ౯ | ౦ | ౫ | ౪ | ౦ | ౫ | ౨ |
| ౧౧ | ౦ | ౬ | ౩ | ౦ | ౫ | ౧౦ | ౦ | ౫ | ౮ |
| ౧౨ | ౦ | ౬ | ౧౦ | ౦ | ౬ | ౫ | ౦ | ౬ | ౨ |
| ౧౩ | ౦ | ౭ | ౫ | ౦ | ౬ | ౧౧ | ౦ | ౬ | ౯ |
| ౧౪ | ౦ | ౮ | ౦ | ౦ | ౭ | ౬ | ౦ | ౭ | ౩ |
| ౧౫ | ౦ | ౮ | ౭ | ౦ | ౮ | ౦ | ౦ | ౭ | ౯ |
| ౧౬ | ౦ | ౯ | ౨ | ౦ | ౮ | ౬ | ౦ | ౮ | ౩ |
| ౧౭ | ౦ | ౯ | ౯ | ౦ | ౯ | ౧ | ౦ | ౮ | ౯ |

| | దినసంబళ్లవివరము. | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| నెలకి | ౨౮ తేదికి | | | ౩౦ తేదికి | | | ౩౧ తేదికి | | |
| రు. | రు. | అ. | పై. | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
| ౧౮ | ౦ | ౧౦ | ౮ | ౦ | ౯ | ౭ | ౦ | ౯ | ౩ |
| ౧౯ | ౦ | ౧౦ | ౧౦ | ౦ | ౧౦ | ౨ | ౦ | ౯ | ౧౦ |
| ౨౦ | ౦ | ౧౧ | ౫ | ౦ | ౧౦ | ౮ | ౦ | ౧౦ | ౪ |
| ౨౧ | ౦ | ౧౨ | ౦ | ౦ | ౧౧ | ౨ | ౦ | ౧౦ | ౧౦ |
| ౨౨ | ౦ | ౧౨ | ౭ | ౦ | ౧౧ | ౯ | ౦ | ౧౧ | ౪ |
| ౨౩ | ౦ | ౧౩ | ౨ | ౦ | ౧౨ | ౩ | ౦ | ౧౧ | ౧౦ |
| ౨౪ | ౦ | ౧౩ | ౯ | ౦ | ౧౨ | ౧౦ | ౦ | ౧౨ | ౫ |
| ౨౫ | ౦ | ౧౪ | ౩ | ౦ | ౧౩ | ౪ | ౦ | ౧౨ | ౧౧ |
| ౨౬ | ౦ | ౧౪ | ౧౦ | ౦ | ౧౩ | ౧౦ | ౦ | ౧౩ | ౫ |
| ౨౭ | ౦ | ౧౫ | ౫ | ౦ | ౧౪ | ౫ | ౦ | ౧౩ | ౧౧ |
| ౨౮ | ౧ | ౦ | ౦ | ౦ | ౧౪ | ౧౧ | ౦ | ౧౪ | ౫ |
| ౨౯ | ౧ | ౦ | ౭ | ౦ | ౧౫ | ౬ | ౦ | ౧౫ | ౦ |
| ౩౦ | ౧ | ౧ | ౨ | ౧ | ౦ | ౦ | ౦ | ౧౫ | ౬ |
| ౪౦ | ౧ | ౬ | ౧౦ | ౧ | ౫ | ౪ | ౧ | ౪ | ౭ |
| ౫౦ | ౧ | ౧౨ | ౭ | ౧ | ౧౦ | ౮ | ౧ | ౯ | ౧౦ |
| ౬౦ | ౨ | ౨ | ౩ | ౨ | ౦ | ౦ | ౧ | ౧౪ | ౧౧ |
| ౭౦ | ౨ | ౮ | ౦ | ౨ | ౫ | ౪ | ౨ | ౪ | ౨ |
| ౮౦ | ౨ | ౧౩ | ౯ | ౨ | ౧౦ | ౮ | ౨ | ౯ | ౩ |
| ౯౦ | ౩ | ౩ | ౫ | ౩ | ౦ | ౦ | ౨ | ౧౪ | ౫ |
| ౧౦౦ | ౩ | ౯ | ౨ | ౩ | ౫ | ౪ | ౩ | ౩ | ౭ |
| ౨౦౦ | ౭ | ౨ | ౩ | ౬ | ౧౦ | ౮ | ౬ | ౭ | ౩ |
| ౩౦౦ | ౧౦ | ౧౧ | ౫ | ౧౦ | ౦ | ౦ | ౯ | ౧౦ | ౧౦ |
| ౪౦౦ | ౧౪ | ౪ | ౭ | ౧౩ | ౫ | ౪ | ౧౨ | ౧౪ | ౫ |
| ౫౦౦ | ౧౭ | ౧౩ | ౯ | ౧౬ | ౧౦ | ౮ | ౧౬ | ౨ | ౧ |
| ౧౦౦౦ | ౩౫ | ౧౧ | ౫ | ౩౩ | ౫ | ౪ | ౩౨ | ౪ | ౨ |

నిత్యనక్షత్రమును చెప్పేటందుకు సూత్రము.

ఆ॥ చనినమాసములను చయ్యనరెట్టించి। గత దినంబులందుగలయగూడి। యశ్వని మొదలుగ నవిలెకఁబెట్టిన। నిత్యతారవచ్చు నిజముగాను॥

ఉత్తరములువ్రాయుటకుసూత్రము.

చ॥ అధిపతిసంధివిగ్రహ రహస్యపు రేఖలువ్రా యుమన్నచో। నిధిరసపావకాష్టశర నేత్రనగాం బుధిచంద్రసంఖ్యలన్। బుధనుతనిల్పియందులకు బూర్వము తొంమిదినెత్తివ్రాయుడీ। బధిరులు మూగలంధులును బాలుకు వృద్ధులు మెచ్చునట్లుగాన్॥

సీ॥ అర్చకుండొకడు దివ్యాబ్జముల్గొనివచ్చి। మాడమృతస్థానమునకు జేర్చి। తొలిదేవళంబు ముంగలికొలంకునదోగ। జేతిపువ్వులుయథాస్థితిరలిర్ప।నందుగొన్నిటిని దైత్యారికినర్పించ। శేషమాగుడితటాకమునముంప। దత్సూనములరెట్టదనరబూర్వపురీతి। నర్పించియవలికోశంబు వలన।ద్రిగుణమైన మొదలిదీనబర మేశు।బూ

జనేసిమిగులుపూలుగుల్ల । మరాటరెంటనొకట నొగివృద్ధిగానుంచె । తొల్లుత నెన్నిదెచ్చెతోయ జములు॥ పుష్పములుమొత్తం-౧౧౧.

ఇంచుకుసూత్రము.

క॥ తిరమగుప్రసూనవృద్ధులు । వరుసనులిఖియించియంశవర్గంబుంబర। స్వరగుణితంబైనను గన। బరగుంబరాజాప్రసూనపటలింబనఘా॥

క॥ మున్నాటదువదివరాడలు । యెన్నగబదియుంగరంబులెంతెంతోబటుగ్‌। డెన్నాళ్లజీతమడిగిన। నన్నాళ్లనునుంగరంబులారాజిచ్చెన్‌॥

ఇంచుకుసూత్రము — ఆ॥ ఒకటిరెండుమూడునొనరంగనాల్గిడి । యవియుబెట్టిసున్నలిసుక బెట్టె। నూరుబెట్టిపిదపనూటయేబదిబెట్టి । ఉంగరములయెత్తు తెలుగవచ్చు — ఉంగరములయెత్తు-

౧ ౨ ౩ ౪ ౧౦ ౨౦ ౩౦ ౪౦ ౧౦౦ ౧౫౦.

క॥ ఇదురాశిమూటిలోపలి। గడనచుమగుణించిరాశిగైకొనిమొదలన్‌। వడిబాలుగొన్నలబ్ధము। బుడమిందైత్రిరాశిఫలముబుధజనవినుతా.

పుట్టిగకి వరహాలు ౪ చొప్పున ౨౫ వరహాలకు యెన్నిపుట్లుకొనవచ్చును- ౬ ౬౹ పుట్లు.

ఇకను కాలవ్యవహారంబులు — కాలంబనగా పోయెనువచ్చెను ఇవి మొదలైన వ్యవహారంబుల కు గారణంబైనభగవత్స్వరూపంబెకాలంబుల ట్టికాలంబఖండంబైనను గ్రహరాశి నక్షత్రాద్యా తకంబైజ్యోతిశ్చక్రంబునందు దిరుగుచున్న చం ద్రసూర్యగతులంబట్టి యఖండ కాలమునందు ఖండకల్పనంబు జేసి జనులువ్యవహారంబు జరిగిం చుటవలన నావ్యవహారంబులు దెలియజేయబడు చున్నవి. అదెట్లనినమనుష్యుని ౬ రెప్పపాట్లుకా లము ౧ విగడియ ౬౦ విగడియలు ౧ గడియ ౭౻ గడియ ౧ ఝామము ౮ ఝాములు ౧ రాత్రిపగ లు ఇదేతిదియందురి ఇటువంటితిథులు ౧౫ ఐతే ౧ పక్షము ౨ పక్షములు ౧ నెల ఇదే పితృదేవత లకు నొకయహోరాత్రము ౨ నెలలు ౧ ఋ తువు 3 ఋతువులు ౧ అయనము ౨ అయనము లు ౧ఏడాది ఇదే దేవతలకు నొకయహోరా

త్రముయిట్టి ౧౦౦ సంవత్సరములైన యొకమను ష్యవశానము ఇట్లేపితృ దేవతలకును దేవతలకును వారివారి యహోరాత్రములచేత వారివారికి పక్షములుమాసములు ఋతువులు అయనములు సంవత్సరములని నెరుగదగినవి.

సంవత్సరములు ౬౦—ప్రభవ-విభవ-శుక్ల - ప్ర మోదూత ప్రజోత్పత్తి-అంగీరస-శ్రీముఖ- భవ- యువ-ధాతు-ఈశ్వర-బహుధాన్య-ప్రమాది - వి క్రమ-విషు-చిత్రభాను-స్వభాను-తారణ- పార్థి వ-వ్యయ-సర్వజిత్తు-సర్వధారి-విరోధి - వికృతి- ఖర-నందన-విజయ-జయ-మన్మథ-దుర్ముఖి - హే విళంబి-విళంబి-వికారి-శార్వరి-ప్లవ - శుభకృతు- శోభకృతు-క్రోధి-విశ్వావసు-పరాభవ - ప్లవంగ- కీలక-సౌమ్య-సాధారణ-విరోధికృతు - పరీధావి- ప్రమాదీచ-ఆనంద-రాక్షస-నళ- పింగళ - కాళ యుక్తి-సిద్ధార్థి-రౌద్రి-దుర్మఖి-దుందుభి - రుధి రోద్గారి-రక్తాక్షి-క్రోధన-అక్షయ.

ఈఅఱువదిన్ని ప్రతిసంవత్సరముల నామములు.

## అయనములు ౨.

ఉత్తరాయణము-దక్షిణాయనము.

ఋతువులు ౬—వసంతఋతువు-గ్రీష్మఋతువు-వర్షఋతువు-శరదృతువు- హేమంతఋతువు-శిశిరఋతువు.

తెనుగునెలలు ౧౨—చైత్రము-వైశాఖము- జ్యేష్ఠము-ఆషాఢము-శ్రావణము - భాద్రపదము-ఆశ్వయుజము-కార్తికము-మార్గశిరము- పుష్యము-మాఘము-ఫాల్గుణము.

అరవనెలలు ౧౨—చిత్రి-వైయ్యాశి-ఆని-ఆడి-ఆవణి-పెరటాశి-అల్పిశి-కార్తికి-మార్గళి-తై-మాశి-పంగుణి.

ఇంగ్లీషునెలలు ౧౨—జనవరి-ఫిబ్రవరి-మార్చి-ఏప్రిల్-మే-జూన్-జూలై-ఆగష్టు- సెప్టంబరు - అక్టోబరు-నవంబరు-డిసంబరు.

తురకనెలలు౧౨ —మొహారం-సఫర్- రబ్బిలవల్-రబ్బిసాని-జమాదిలవల్-జమాదిసాని- రజబుంషాబాల్-రంజాన్-షవ్వాల్-జిలకాల్-జిలహేద్.

| వారములు ౭. | | వారములకు ప్రతి నామములు ౭. | |
|---|---|---|---|
| ఆదివారము | ౧ | భానువారము | ౧ |
| సోమవారము | ౨ | ఇందువారము | ౨ |
| మంగళవారము | ౩ | భౌమవారము | ౩ |
| బుధవారము | ౪ | సౌమ్యవారము | ౪ |
| బృహస్పతివారము | ౫ | గురువారము | ౫ |
| శుక్రవారము | ౬ | భార్గవవారము | ౬ |
| శనివారము | ౭ | మందవారము | ౭ |

శుక్లపక్షతిథులు ౧౫.

| | | | |
|---|---|---|---|
| శుద్ధపాడ్యమి | ౧ | శుద్ధనవమి | ౯ |
| శుద్ధవిదియ | ౨ | శుద్ధదశమి | ౧౦ |
| శుద్ధతదియ | ౩ | శుద్ధఏకాదశి | ౧౧ |
| శుద్ధచవితి | ౪ | శుద్ధద్వాదశి | ౧౨ |
| శుద్ధపంచమి | ౫ | శుద్ధత్రయోదశి | ౧౩ |
| శుద్ధషష్ఠి | ౬ | శుద్ధచతుర్దశి | ౧౪ |
| శుద్ధసప్తమి | ౭ | శుద్ధపున్నమ | ౧౫ |
| శుద్ధాష్టమి | ౮ | | |

## కృష్ణపక్షతిథులు-

| | | | |
|---|---|---|---|
| బహుళపాడ్యమి | ౧ | బహుళనవమి | ౯ |
| బహుళవిదియ | ౨ | బహుళదశమి | ౧౦ |
| బహుళతదియ | ౩ | బహుళఏకాదశి | ౧౧ |
| బహుళచవితి | ౪ | బహుళద్వాదశి | ౧౨ |
| బహుళపంచమి | ౫ | బహుళత్రయోదశి | ౧౩ |
| బహుళషష్ఠి | ౬ | బహుళచతుర్దశి | ౧౪ |
| బహుళసప్తమి | ౭ | బహుళమావాస్య | ౧౫ |
| బహుళాష్టమి | ౮ | | |

## యుగములు ౪.

కృతయుగ సం|| ౧౭ లక్షల ౨౮ వేలు-
త్రేతాయుగ సం|| ౧౨ లక్షల ౯౬ వేలు.
ద్వాపరయుగ సం|| ౮ లక్షల ౬౪ వేలు.
కలియుగ సం|| ౪ లక్షల ౩౨ వేలు.

ఇట్లు చెప్పిన చతుర్యుగము ౨ వేలుకొన్నది బ్రహ్మదేవునికి ఒకదినమని చెప్పబడును.

జ్యోతిశ్చక్రంబునందు నక్షత్రములు ౨౭.

అశ్వని-భరణి-కృత్తిక-రోహిణి-మృగశిర-

[illegible] పునర్వసు- పుష్యమి-ఆశ్లేష- మఖ-పుబ్బ-ఉత్తర-హస్త-చిత్త-స్వాతి-విశాఖ-అనూరాధ-జ్యేష్ఠ-మూల-పూర్వాషాఢ-ఉత్తరాషాఢ-శ్రవణము-ధనిష్ఠ-శతభిషము-పూర్వాభాద్ర-ఉత్తరాభాద్ర-రేవతి.

యోగములు ౨౭ విష్కంభము- ప్రీతి - ఆయుష్మాన్-సౌభాగ్యము - శోభనము - అతిగండము-సుకర్మము-ధృతి-శూలము-గండము - వృద్ధి-ధ్రువము-వ్యాఘాతము-హర్షణము-వజ్రము- సిద్ధి-వ్యతిపాత్- వరీయాన్- పరిఘము-శివము-సిద్ధము-సాధ్యము-శుభము- శుభ్రము- బ్రాహ్మ్యము- ఐంద్రము-వైధృతి.

కరణములు ౧౧. బవ-బాలవ-కౌలవ- తైతుల-గరజి-వణజి-శకున-భద్ర-చతుష్పాత్-నాగవము-కింస్తుఘ్నము.

రాసులగడియలు— మేషము ౪। వృషభము ౪౻ మిథునము ౫। కర్కాటము ౫౻ సింహము ౫। కన్య ౫ తుల ౫ వృశ్చికము ౫। ధనస్సు ౫౻

మకరము ౧౦ కుంభము ౧౧ మీనము ౧౨

ఈ౧౨విన్న రాసులకు అంతుగడేయబడు౦

రాసులకు ప్రతినామములు.

| | |
|---|---|
| మేషము మేక | తుల త్రాసు |
| వృషభము యెద్దు | వృశ్చికము తేలు |
| మిథునము దంపతులు | ధనస్సు విల్లు |
| కర్కాటకం ఎండ్రకా | మకరము మొసలి |
| సింహము సింగము (యా | కుంభము కడవ |
| కన్య పడుచు | మీనము చేప |

నవగ్రహములు ౯—సూర్యుడు - చంద్రుడు. అంగారకుడు-బుధుడు- బృహస్పతి - శుక్రుడు- శనైశ్చరుడు - రాహువు - కేతువు.

సప్తఋషులు ౭—కశ్యపుడు-అత్రి- భరద్వాజుడు-విశ్వామిత్రుడు-గౌతముడు-జమదగ్ని- వసిష్ఠుడు. ఈ౭న్ను సప్తఋషులకు పేర్లు.

ఇకను దేశవ్యవహారంబులు.

దేశంబనగా-తూర్పు-పడమర- అనునవి మొదలయిన వ్యవహారంబులకు హేతువైన భగవ

త్స్వరరాపమే దేశంబుం అనెదిక్కు అష్టదిక్కు అఖండంబైనసూర్యోదయ సూర్యాస్తమయం బులంబట్టి జనులకు సూర్యుండు ఉదయకాలము రాగానేముందుగా నెక్కడకానబడుచున్నా డో అదితూర్పు అనియును దానిఎడమ ప్రక్క దక్షిణమనియు కుడిప్రక్క నుత్తరమనియు వీ పుప్రక్క పడమరయనియు ఖండంబులంగల్పిం చుకొని యనేకవ్యవహారంబులం చేయుచున్నా రదెట్లనిన.

అష్టదిక్కులు ౮.

తూర్పు అగ్నిమూల-దక్షిణము-నైరుతిమూల పడమర-వాయువ్యమూల-ఉత్తరము-ఈశా న్యమూల.

దిక్పాలకులు ౮.

ఇంద్రుడు- అగ్ని- యముడు-నైరుతి- వరుణు డు-వాయువు-కుబేరుడు-ఈశాన్యుడు-వీరు అష్ట దిక్కులనేదేవతలు.

అష్టదిక్పాలకులపట్టణములు ౮.

అమరావతి- తేజోవతి- సంయమిని- కృష్ణాం గన- శ్రద్ధావతి- గంధవతి-అలక-యశోవతి-

అష్టదిక్పాలకులభార్యలు ౮.

శచీదేవి-స్వాహాదేవి-శ్యామలాదేవి-దీర్ఘాదేవి
కాళికాదేవి-అంజనాదేవి-చిత్రరేఖ-పార్వతీదే
వి.

అష్టదిక్పాలకులవాహనములు౮.

ఐరావతము-తగరు-మహిషము-నరుడు-ముస
లి-లేడి-గుఱ్ఱము-వృషభము.

అష్టదిక్పాలకులాయుధములు ౮.

వజ్రము-శక్తి-దండము-కుంతము-పాశము-
ధ్వజము-ఖడ్గము త్రిశూలము.

అష్టదిగ్గజములు౮.

ఐరావతము పుండరీకము వామనము-కుము
దము అంజనము పుష్పదంతము-సార్వభౌమము
సుప్రతీకము.

అష్టదిగ్గజములభార్యలు ౮.

అభ్రము కపిల పింగళ అనుపమ-తామ్రపర్ణి
శుభ్రదంతి అంగన-అంజనావతి.

సప్తసముద్రములు ౭.

లవణసముద్రము-ఇక్షుసముద్రము-సురాస
ముద్రము సర్పిస్సముద్రము-దధిసముద్రము-క్షీ
రసముద్రము-శుద్ధోదకసముద్రము.

సప్తద్వీపములు ౭ - జంబుద్వీపము - ప్లక్షద్వీపము - కుశద్వీపము - క్రౌంచద్వీపము - శాకద్వీపము - శాల్మలిద్వీపము - పుష్కరద్వీపము.

నవవర్షములు ౯ - భారతవర్షము - కింపురుషవర్షము - హరివర్షము - ఇలావృతవర్షము - రమ్యకవర్షము - హిరణ్యకవర్షము - కురువర్షము - భద్రాశ్వవర్షము - కేతుమాలవర్షము.

వర్షపర్వతములు ౮ హిమాచలము - హేమకూటము - నిషధము - నీలము - శ్వేత - శృంగి - మాల్యవంతము - గంధమాదనము.

నవఖండములు ౯ - భరతఖండము - ఇంద్రఖండము - చమసఖండము - గభస్తిఖండము - నాగఖండము - తామ్రఖండము - వారుణిఖండము - సౌమ్యఖండము - గంధర్వఖండము.

ఊర్ధ్వలోకములు ౭ - భూలోకము - భువర్లోకము - స్వర్లోకము - మహాలోకము - జనలోకము - తపోలోకము - సత్యలోకము.

అధోలోకములు ౭ అతలము - వితలము - సు

తలము- తలాతలము- రసాతలము మహాతలము- పాతాళము.

ఏటేటా వచ్చెడి పండుగ పర్వతిథులు ౧౭. పాడ్యమి - సంవత్సరాదిపాడ్యమి। విదియ। భానువిదియ

తదియ అక్షతదియ

చవితి వినాయకచవితి

పంచమి గరుడపంచమి

షష్ఠి సుబ్బరాయషష్ఠి

సప్తమి రథసప్తమి

అష్టమి గోకులాష్టమి

నవమి శ్రీరామనవమి

దశమి విజయదశమి

ఏకాదశి భీష్మఏకాదశి

ద్వాదశి చిలుకద్వాదశి

త్రయోదశి శనిత్రయోదశి

చతుర్దశి అనంతపద్మనాభచతుర్దశి

పున్నమ వ్యాసపున్నమ

అమావాస్య దీపావళి యమావాస్య

ఏటేటా వచ్చెడి పండుగ పర్వతిథుల నెలలు.

చైత్రశుద్ధమందు—సంవత్సరాదిపాడ్యమి

భానువారమంతో కూడినది—భానువిదియ

వైశాఖశుద్ధమందు—అక్షతదియ

భాద్రపదశుద్ధమందు—వినాయకచవితి

శ్రావణశుద్ధమందు—గరుడపంచమి
మార్గశిరశుద్ధమందు—సుబ్బరాయషష్ఠి
మాఘశుద్ధమందు—రథసప్తమి
శ్రావణబహుళమందు—గోకులాష్టమి
చైత్రశుద్ధమందు—శ్రీరామనవమి
ఆశ్వయుజశుద్ధమందు—విజయదశమి
ఆషాఢశుద్ధమందు—భీష్మైకాదశి
కార్తీకశుద్ధమందు—చిలుకద్వాదశి
శనివారముతో చేరినది—శనిత్రయోదశి
భాద్రపద॥శు॥ మందు—అనంతపద్మనాభచతుర్దశి
వైశాఖశుద్ధమందు—వ్యాసపూర్ణిమ
ఆశ్వయుజ-బ॥ మందు—దీపావళిఅమావాస్య

నామనక్షత్రములు-

| | |
|---|---|
| చూచేచోలాఅశ్విని ౫౦ | కూకంగచ్ఛఆర్ద్ర ౨౧ |
| లీలూలేలో భరణి ౨౪ | కేకోహాహీపునర్వసు ౩౦ |
| ఆఈఊఏ కృత్తిక ౩౦ | హూ హే హో డా పుష్యమి ౨౪ |
| వోవవీవూ రోహిణి ౪౦ | |
| వేవోకాకిమృగశిర ౧౪ | డీడూడేడో ఆశ్లేష ౩౨ |

| | |
|---|---|
| మామీమరామే మఖ ౩౦ | బరాధాబాఢా. పూర్వా |
| వెరాటాఃకేటూపుబ్బ ౨౦ | షాఢ ౨౦ (ధ౨౦ |
| టేటోపాపి-ఉత్తర ౧౮ | బేబోజాజి, వుత్తరాషా |
| పూషణ్ణాథా-హస్త ౨౨ | జూజేజోగఅభిజిత్తు ౧౦ |
| పెపోరారి చిత్త ౨౦ | ఖిఖురాఖేఖో శ్రవణం౧౦ |
| రరారేరోతా స్వాతి ౧౪ | గాగీగరాగే, ధనిష్ఠ ౧౦ |
| తీతరాతేతో విశాఖ ౧౪ | గోససీసుశతభిషం ౧౮ |
| నానీనరానే, అనూరా | సేసోదాది, పూర్వాభా |
| ధ ౧౦ (జ్యేష్ఠ౧౪ | ద్ర ౧౬ |
| నో యా యి యూ | దుశ్ఛంచాదా. ఉత్తరా |
| యేయో బాబి మూల | భాద్ర ౨౦ |
| ౨౦-౫౬ | దేదోచాచీ, రేవతి ౩౦ |

ఈనక్షత్రములకు చేరికగా వేసియుండేగడియలకువైన ౩౪ గడియలుత్యాజ్యకాలము.

## ప్రయాణ నిషేదవారములు.

శ్లో॥ నపూర్వేశనిసోమేచ నగురుద్దక్షిణేతథా।
నపశ్చాద్భానుశుక్రేచనోత్తరేబుధమంగళే-

## ప్రయాణనిహితవారములు.

శ్లో॥ అంగారపూర్వేగమనేచలాభం । సోమే చనిర్గచ్ఛేణమర్థలాభం । బుధాగురుపశ్చిమకార్య సిద్ధిఃరవౌభృగౌచోత్తరదాస్యలాభం.

## నక్షత్రములవల్లదశలువిప్పేవివరములు.

| | | |
|---|---|---|
| అశ్వి.మఖ.మూల.కేతుదశ.సంవత్సరములు. | | ౭ |
| భర.పుబ్బ.పూర్వా.శుక్రదశ | సం॥ | ౨౦ |
| కృత్తి.ఉత్త.ఉత్తరా.సూర్యదశ | సం॥ | ౬ |
| రోహి.హస్త.చంద్రదశ | సం॥ | ౧౦ |
| మృగశి.చిత్త.ధనిష్ఠ.కుజదశ | సం॥ | ౭ |
| ఆరు.స్వాతి.శత.రాహుదశ | సం॥ | ౧౮ |
| పునర్వ.విశా.పూర్వా.గురుదశ | సం॥ | ౧౬ |
| పుష్య.అనూరా.ఉత్తరా.శనిదశ | సం॥ | ౧౯ |
| ఆశ్లేష.జ్యేష్ఠ.రేవతి.బుధదశ | సంవత్స | ౧౭ |

## మూడుసంఖ్యలుగలవి.

త్రిమూర్తులు—బ్రహ్మ। విష్ణువు। రుద్రుడు॥

## త్రిలోకములు.

స్వర్గలోకము।మర్త్యలోకము।పాతాళలోకము॥

త్రిగుణములు-

సత్వగుణము-రజోగుణము-తమోగుణము॥

త్రికరణములు. మనస్సు। వాక్కు। కాయము॥

అవస్థాత్రయము.

జాగ్రదవస్థ-స్వప్నావస్థ-సుషుప్త్యవస్థ॥

క్రియలు—మణి।మంత్రము।ఔషధము॥

నాయకులు—స్వీయ।పరకీయ।సామాన్య॥

రీతులు—వైదర్భి।గౌడి।పాంచాలి॥

పాకములు-

ద్రాక్షాపాకము-నారికేళపాకము। కదళీపాకము-

అక్షిత్రితయము—కంచికామాక్షి। మధురమీ

నాక్షి। కాశివిశాలాక్షి॥ (తాంబ॥

అంబాత్రయము-మూకాంబ। జ్ఞానాంబ। భ్రమ

కాలములు-భూతము।భవిష్యత్తు।వర్తమానము॥

శక్తిత్రయము- ప్రభుశక్తి।ఉత్సాహశక్తి। మంత్రి

శక్తి॥ ధనగతులు- దానము।భోగము। నాశము॥

నాలుగుసంఖ్యలుగలవి—చతుర్వేదములు। ఋ

గ్వేదము।యజుర్వేదము। సామవేదము। అదర్వ

ణవేదము॥ పురుషార్థములు—ధర్మము॥అర్థము।కామము।మోక్షము॥

సేనాంగములు—రథములు।గజములు । తురగములు।పదాతులు॥ (భేదము।దండము॥

చతుర్విధోపాయములు—సామము। దానము॥

పురుషజాతులు—భద్రుడు।దత్తుడు।కూచిమారుడు।పాంచాలుడు॥

స్త్రీజాతులు—పద్మిని।హస్తిని।చిత్తిని।శంఖిని॥

వయోవస్థలు—బాల్యము । యౌవనము । కౌమారము।వృద్ధత్వము॥

చతురాశ్రమములు—బ్రహ్మచర్యము। గార్హస్థ్యము।వానప్రస్థము।సన్న్యాసము॥

కావ్యవృత్తులు—కైశికి॥ఆరభటి। సాత్వతిభారతి॥

అంతఃకరణచతుష్టయములు—మనస్సు। బుద్ధి చిత్తము।అహంకారము॥

ఐదుసంఖ్యలుగలవి॥

పంచభూతములు—పృథివి।అప్పు। తేజస్సు।వాయువు।ఆకాశము॥

జ్ఞానేంద్రియములు—ఘ్రాణేంద్రియము। రసనేంద్రియము। చక్షురింద్రియము। త్వగింద్రియము। శ్రోత్రేంద్రియము-

కర్మేంద్రియములు—వాక్కు।పాణి। పాదము। వాయువు।ఉపస్థ-

పంచపర్వములు—కృష్ణపక్షాష్టమి। కృష్ణపక్షచతుర్దశి।అమావాస్య।పున్నమ।సంక్రాంతి॥

పంచమహాపాతకములు—స్వర్ణస్తేయము । సురాపానము। బ్రహ్మహత్య। గురుపత్నిగమనము। మహాపాతకసహవాసము॥

పంచప్రాణములు—ప్రాణము।అపానము । వ్యానము।ఉదానము।సమానము॥

ఉపవాయువులు—నాగము।కూర్మము। కృకరము। దేవదత్తము।ధనంజయము॥

పంచభక్ష్యములు—భక్ష్యము । భోజ్యము । లేహ్యము।చోష్యము।పానీయము॥

పంచగంగలు—కావేరి।తుంగభద్ర । కృష్ణవేణి। గౌతమి।భాగీరథి॥

తల్లులు—రాజుభార్య। అన్నభార్య। గురుభార్య। భార్యనుగన్నతల్లి। తన్నుగన్నతల్లి॥

తండ్రులు—తన్నుగన్నవాఁడు। తనకువడుగు జేసినవాఁడు। చదువు చెప్పినవాఁడు। విపత్తునఅన్న ముబెట్టి కాపాడినవాఁడు। ఆపదయందు భయము దీర్చి రక్షించినవాఁడు॥

పంచాంగములు—తిథి। వారము। నక్షత్రము। యోగము। కరణము॥

పంచకావ్యములు—రఘువంశం। కుమారసంభవం। మేఘసందేశం। మాఘం। భారవి॥

విష్ణుదేవునిపంచాయుధములు—చక్రం। శంఖము। గద। ఖడ్గము। శార్ఙ్గము॥

పంచవన్నెలు—తెలుపువన్నె। ఎఱుపువన్నె। నలుపువన్నె। ఆకుపసుపువన్నె। పసిమివన్నె॥

పంచగవ్యములు—గోమూత్రము। గోమయము। గోఘృతము। గోదధి। గోక్షీరము॥

పంచామృతములు—ఉదకం। పాలు। పెరుగు నెయ్యి। తేనె

ఆరుసంఖ్యలుంగలవి-

షణ్మతములు—శైవము। వైష్ణవము। శాక్తము। గాణాపత్యము। సౌరము। కాపాలము॥

షడ్రసములు—ఉప్పు। పులుసు। కారము। తీపు చేదు। వగరు॥

అరిషడ్వర్గములు—కామము। క్రోధము। లోభము। మోహము। మదము। మాత్సర్యము॥

షట్కర్మములు—యజనము। యాజనం। అధ్యయనము। అధ్యాపనము। దానం। ప్రతిగ్రహము॥

ఈతిబాధలు—అతివృష్టి। అనావృష్టి। మిడుత। పందికొక్కులు। చిలుకలు। సన్నిహితరాజులు॥

షట్చాస్త్రములు—తర్కశాస్త్రము। వ్యాకరణశాస్త్రము। ధర్మశాస్త్రము। మీమాంసాశాస్త్రము। వైద్యశాస్త్రము। జ్యోతిశాస్త్రము॥

షడ్గుణములు-

సంధిచేసుట। కలహించుట। యుద్ధమునకుబోవుట। యుద్ధకాలమెదురుచూచుట। భేదపరచుట। బలవంతులనాశ్రయించుట॥

చక్రవర్తులు॥

శ్లో॥ హరిశ్చంద్రో నలో రాజా పురుకుత్సః పురూరవః। సగరః కార్తవీర్యశ్చ షడేతే చక్రవర్తినః॥

షట్చక్రవర్తులు-

హరిశ్చంద్రుడు। నలుడు। పురుకుత్సుడు। పురూరవుడు। సగరుడు। కార్తవీర్యార్జునుడు॥

ఏడుసంఖ్యలుగలవి-సప్తవ్యసనములు-

జూదమాడుట। స్త్రీలఁగోరుట। కల్లుద్రాగుట। వేటాడుట। కఠినపుమాటలాడుట। ఒరులసొమ్మునపహరించుట।ఒరులనిందించుట॥

సప్తసంతానములు—తటాకప్రతిష్ఠ।ధననిక్షేపము। అగ్రహారప్రతిష్ఠ। దేవాలయప్రతిష్ఠ। వనప్రతిష్ఠ।ప్రబంధనిర్మాణము।సత్రప్రతిష్ఠ॥

సప్తకులపర్వతములు.

హిమవంతము। నిషధము। వింధ్యము। మాల్యవంతము। పారియాత్రము। గంధమాదనము। హేమకూటము॥ సభాసప్తాంగములు-

కవీశ్వరులు।విద్వాంసులు।పౌరాణికులు।

పూర్వకథలు-చెప్పెడివాడు- స్తుతిపాఠకుడు- హాస్యకథలు-గాయకుడు.

ఎనిమిదిసంఖ్యలుగలవి అష్టైశ్వర్యములు.

దాసీజనము- భృత్యులు- పుత్రులు - మిత్రులు- బంధువులు- వాహనములు ధనము ధాన్యం

అష్టభోగములు. అన్నము- వస్త్రము - గంధము।పుష్పము।పానుపు।తాంబూలము। స్త్రీ గానం.

అష్టకర్మములు.

దాస్యము- దారిద్ర్యము భార్యలేకనుండుట - స్వయంకృషి-చెడాబియ్యడుగుట- అడిగినలేదనుట-అప్పుబడుట-త్రోవనడుచుట.

అష్టసిద్ధులు. అణిమ-మహిమ- గరిమ-లఘిమ- ప్రాప్తిప్రాకామ్య-ఈశిత్వం వశిత్వం.

అష్టవస్తువులు.

వరుణుడు-వృషభుడు-నహుష్యుడు- జయుడు- అనిలుడు- విష్ణుడు- ప్రభాసుడు - ప్రత్యూషుడు.

అష్టగంధములు. కస్తూరిముకర్పూరము।పునుగు! జవ్వాజి। అగరు।పన్నీరు।అత్తరు।శ్రీగంధము.

అష్టావధానములు.

చతురంగము-కవిత్వము- వ్రాయుట- చదువుట. గణితము సంగీతము-యుక్తిచెప్పుట-వ్యస్తాక్షరి.

తొమ్మిదిసంఖ్యలుగలవి.

నవ బ్రహ్మలు-మరీచి- భరద్వాజుడు- ఆంగీరసుడు-పులస్త్యుడు-పులహుండు-క్రతువు - దక్షుండు-వసిష్ఠుడు-వామదేవుడు.

నవరసములు—శృంగారరసము-హాస్యరసము కరుణారసము-రౌద్రరసము- వీరరసము- భయానకరసము- భీభత్సరసము- అద్భుతరసము- శాంతరసము.

నవరత్నములు. వజ్రం-వైడూర్యం- గోమేధికం-పుష్యరాగం-మరకతం-మాణిక్యం- నీలం- ప్రవాళం-ముత్యం. నవధాన్యములు వడ్లు-యవలు-పెసలు-వినుములు-నువ్వులు-గోధుమలు-అనుములు-ఉలవలు- సెనగలు.

నవనిధులు. మహాపద్మం- పద్మం- శంఖం - మకరం-కచ్ఛపం- ముకుందం- కుందం- నీలం-వరం

పదిసంఖ్యలుగలవి.

మన్మథావస్థలు—కనులజూచుట- మనసుదగలుట-సంకల్పించుట- నిద్రబట్టకుండుట- చిక్కిపోవుట-అన్నిటవిసుకుబుట్టుట-సిగ్గువిడుచుట- చిత్తభ్రమనొందుట- మూర్ఛనొందుట - మరణమునకుయత్నించుట.

దశదానములు—గోదానము- ధరాదానము-తిలదానము-హిరణ్యదానము-ఘృతదానము-వస్త్రదానము-ధాన్యదానము-గుడదానము- రౌప్యదానము-లవణదానము.

పదునొకండుసంఖ్యలుగలవి.

ఏకాదశరుద్రులు-ఉగ్రుడు-సోముడు - శర్వుడు-మృగవ్యాధుడు - రంతిజుడు-భిక్షకుడు- యహిర్బుధ్నుడు-పినాకి- పాదుకేశ్వరుడు- కాపాలికేయుడు-భౌముడు.

పండ్రెండుసంఖ్యలుగలవి.

ద్వాదశాదిత్యులు—అర్యముడు-మిత్రుడు- వరుణుడు - అరుణుడు- భగుడు-ఇంద్రుడు-వివ

స్వాంతుడు-ప్రాభుతుడు-పర్జన్యుడు-త్వష్ట - విష్ణువు అజఘన్యుడు.

పదునాలుగు సంఖ్యగలవి.

చతుర్దశమనువులు— స్వాయంభువమనువు-స్వారోచిషమనువు-ఉత్తమమనువు- తామసమనువు-రైవతమనువు-చాక్షుషమనువు-వైవస్వతమనువు- సూర్యసావర్ణికమనువు - దక్షసావర్ణికమనువు- బ్రహ్మసావర్ణికమనువు - రుద్రసావర్ణికమనువు-ధర్మసావర్ణికమనువు- రౌచ్యమనువు - భౌచ్యమనువు.

చతుర్దశవిద్యలు.

ఋగ్వేదము-యజుర్వేదము-సామవేదము-అథర్వణవేదము-శిక్ష-వ్యాకరణము ఛందస్సు నిరుక్తము-జ్యోతిషము-కల్పము మీమాంసాశాస్త్రము-న్యాయశాస్త్రము-పురాణము- ధర్మశాస్త్రము.

పదునారుసంఖ్యగలవి-

షోడశోపచారములు. ఆవాహనము - ఆసనము పాద్యము - అర్ఘ్యము- ఆచమనీయము - స్నానము-వస్త్రము- యజ్ఞోపవీతము- గంధము--పు

ష్పము-ధూపము దీపము-నైవేద్యము- తాంబూల
ము-నమస్కారము-ఉద్వాసనము.

షోడశకర్మములు— గర్భాధానము- పుంసవన
ము-సీమంతము- జాతకర్మము - నామకరణము-
అన్నప్రాశనము- చౌళము- ఉపనయనము- ప్రా
జాపత్యము-సౌమ్యము అగ్నేయము వైశ్వదేవ
ము గోదానము సమావర్తనము - వివాహము-
అంత్యకర్మము.

శ్లో॥ గయాంబరీషౌ శశిబిందుసంగౌ। పృథుమరు
త్వన్భరతౌ సుహోత్ర । రామాదిలీపౌ నృగ
రంతిదేవా। యయాతిమాంధాతృభగీరథాశ్చ॥

షోడశమహారాజులు— గయుడు - అంబరీష
డు శశిబిందుడు-అంగుడు పృథుడు- మరుత్తు-సు
హోత్రుడు- పరశురాముడు- శ్రీరాముడు- భ
రతుడు- దిలీపుడు-నృగుడు రంతిదేవుడు య
యాతి-మాంధాత-భగీరథుడు.

పదునెనిమిదిసంఖ్యలుగలవి.

అష్టాదశపురాణములు—బ్రాహ్మముపాద్మ

ము-వైష్ణవము-శైవము - భాగవతము - భవిష్యోత్త
రము-నారదీయము- మార్కండేయము- ఆగ్నే
యము-బ్రహ్మకైవర్తము-లైంగము- వారాహము-
స్కాందము- గారుడము। వామనము। మాత్స్య
ము।కౌర్మము।బ్రహ్మాండము.

అష్టాదశోపురాణములు— సనత్కుమారము।
నారసింహాయము । స్కాందము । శివధర్మము।
దౌర్వాసము। నారదీయము। కాపిలము। మాన
వము।ఔశనము। బ్రహ్మాండము। వారుణము। కౌ
శికము। లయింగము। సాంబము। సౌరము। పా
రాశరము।మారీచము।భాగవతము.



విద్యాభివృద్ధి కొరకు వర్ణిష్ఠులుగా తగ్గజనులు.
అయాకాలములయందు పఠించవలశినశ్లోకం.

విష్ణుదర్శనము చేయునపుడు పఠించునది.

శాంతాకారంభుజగశయనం । పద్మనాభం
సురేశం ।విశ్వాకారంగగనసదృశం। మేఘవర్ణం
శుభాంగం।లక్ష్మీకాంతంకమలనయనం।యోగి

హృద్ధ్యానగమ్యం। వందేవిష్ణుం భవభయహరం। సర్వలోకైకనాథం॥

శివదర్శనము చేయునపుడు పఠించునది.

వందేశంభుముమాపతింసురగురుం।వందేజగత్కారణం।వందేపన్నగభూషణంమృగధరం।వందేపశూనాంపతిం। వందేసూర్యశశాంకవహ్నినయనం। వందేముకుందప్రియం। వందేభక్తజనాశ్రయంచవరదం।వందేశివంశంకరం॥

విఘ్నేశ్వరదర్శనము జేయునపుడుపఠించునది.

శుక్లాంబరదరంవిష్ణుం। శశివర్ణం చతుర్భుజం। ప్రసన్నవదనంధ్యాయే । త్సర్వవిఘ్నోప శాంతయే। అగజాననపద్మార్కం । గజాననమహర్నిశం। అనేకదంతభక్తానా । మేకదంతముపాస్మహే॥

మహాలక్ష్మీదర్శనము చేయునపుడు పఠించునది.

వందేలక్ష్మీంపరశివమయీం । శుద్ధజాంబూనదాభాం। తేజోరూపాంకనకవసనాం। స్వర్ణభూషోజ్జ్వలాంగీం। బీజాపూరంకనకకలశం। హేమ

పహం దీపనసాద్యాతిసప్వం। సంధ్యాదీప నమో
స్తుతే॥

ప్రతిదినము శయనించునప్పుడు పఠించునది.

రామస్కందం హనూమంతం। వైనతేయం వృకోదరం। శయనేయస్స్మరేన్నిత్యం। దుస్వప్నంతస్యనశ్యతి॥

అశ్వత్థదర్శనము జేయునప్పుడు పఠించునది.

మూలతో బ్రహ్మరూపాయ। మధ్యతో విష్ణురూపిణే। అగ్రతశ్శివరూపాయవృక్షరాజాయతేనమః.

తులసదర్శనము జేయునప్పుడు పఠించునది.

యన్మూలేసర్వతీర్థాని యన్మధ్యేసర్వదేవతాః। యదగ్రేసర్వవేదాశ్చ। తులసింత్వాంనమామ్యహం॥

భోజనముచేయగా నేపఠించునది.

అగస్త్యంకుంభకర్ణంచ। శమ్యంచబడబానలమ్। ఆహారపరిణామార్థం। స్మరామిచవృకోదరం.

ఔషధము సేవచేయునప్పుడు పఠించునది.

ధన్వంత్రిణంగరుత్మంతం। ఫణిరాజంచకౌస్తుభం। అచ్యుతంచామృతంచంద్రం। స్మరేదౌషధకర్మణి॥

కషాయంబుదీసుకొనునపుడు పఠించునది.

శరీరేజర్ఝరీభూతేవ్యాధిగ్రస్తకళేబరే। ఔష
ధంజాహ్నవీతోయం। వైద్యోనారాయణోహరిః.

ఇంటినుంచి కార్యార్థముగాపోవునపుడు.

దుశ్శకునవినాశనంబుగాపఠించునది.

యశ్శివోనామరూపాభ్యాం। యాదేవీసర్వమం
గళా। తయోస్సంస్మరణాత్పుంసాం। సర్వతోజ
యమంగళం॥ లాభస్తేషాంజయస్తేషాం। కుతస్తే
షాంపరాభవః। యేషామిందీవరశ్యామో। హృద
యస్థోజనార్దనః॥ అగ్రతఃపృష్ఠతశ్చైవ। పార్శ్వ
తశ్చమహాబలౌ। ఆకర్ణపూర్ణధన్వానౌ। రక్షేతాం
రామలక్ష్మణౌ॥ సన్నద్ధఃకవచీఖడ్గీ। చాపబాణధ
రోయువా। గచ్ఛన్మమాగ్రతోనిత్యం। రామః
పాతుసలక్ష్మణః॥

జాబులువ్రాయువకరణములు.

స్వాస్త్రంబులోవైదికులువ్రాసికొనుక్రమము.

శ్రీమద్యజనయాజనాద్యయనాద్యాపక దా
నప్రతిగ్రహనిగ్రహషట్కర్మనిరతులైనవేద

మహారాహులైన ఫలానివారికి ఫలానివారు నిత్యం త్రికాలములయందును అనేకనమస్కారంబులు జేసి చేయంగలవిన్నపములు మేము ఇచ్చట ఫలాని దినమువరకు లేకఫలానిపేరుగల స్థలమందు కుశలము అచ్చట తమ సకల సంతోషాతిశయములకును లేక క్షేమాతిశయములకును లేకశుభస్థితులకును లేక సౌఖ్యస్థితులకును లేక అభ్యుదయంబులకును లేక భవదీయమంగళ ప్రమోదంబులకును వ్రాయించిపంపుచు రావలెను.

ఈపైన దెలిపియుండే స్వాస్తులకు యితరజాతులకు క్షత్రియాదులకు వ్రాయునెడల నిత్యం త్రికాలములయందును అనేకనమస్కారములను మాటకుబదులుగా అనేకవందనములని వ్రాయుచున్నారు.

లౌకికమంయుండే వైదికులకు వ్రాయుక్రమము.

శ్రీమద్యజనయాజనాధ్యయనాధ్యాపక దానప్రతిగ్రహ షట్కర్మనిరతులైన రాజమాన్యరాజపూజిత రాజశ్రీ బ్రహ్మశ్రీ సంపన్న

జెప్పిన. దేహసంబంధులకున్నూ ఆయా నడల ఆశీర్వచనంబులు అనుష్ఠానమునకు బదులుగా దీవెనలని యు ఆశీర్వదించి అనుష్ఠానమునకు బదులుగా దీవించి అని వ్రాయవలెను.

స్మార్తులలో వైదికులు వ్రాయు క్రమము.

ఉత్తమపక్షము.

శ్రీమదఖండితలక్ష్మీప్రసన్నులయిన ఆశ్రిత విద్వజ్జనపోషకులైన రాజమాన్య రాజపూజితమహారాజరాజశ్రీ సంపన్నులగు ఫలానివారికి తమ ముఖ్యాశ్రితులగు ఫలానివారు సకల శ్రేయస్సులుంగలుగునటుల అనేక వేదోక్తాశీర్వచనములు చేసి చేయుంగల విన్నపములు మేమున్ను యిచ్చట తమవిశ్వాసాతిశయములవల్ల క్షేమము అచ్చట తమ సకల సామ్రాజ్యలక్ష్మీ విభవాతిశయములకు వ్రాయించి పంపుతు రావలెను.

క్షత్రియాదులుమీద జెప్పినయోగ్యులకు వ్రాయు నెడల ఫలానివారికి ఫలానివారు అనేక దండములు పెట్టి చేయుంగల విన్నపములు అని వ్రాయ

వలెను॥ఇదితప్ప తక్కినవర్ణనములుసమానము.

మధ్యమపక్షము.

శ్రీమదఖండితలక్ష్మీప్రసన్న రాజమాన్య రాజ
భ్రాజితమహారాజరాజశ్రీ సంపన్నులయిన ఫలాని
వారికిఫలానివారు సకల శ్రేయస్సులుకలుగునటు
వేదోక్తాశీర్వచనములుచేసి చేయంగల విన్నప
ములు మేమున్న ఇచ్చట క్షేమము అచ్చటితమ
సకలసంతోష లక్ష్మీ విభవాతిశయములకునువ్రా
యించిపంపుచురావలెను.

కేవలలౌకికులగు వైదికులకు వ్రాయుక్రమము.

శ్రీమద్యజనాదిషట్కర్మనిరతులయినవేదమూ
ర్తులయినఫలానివారికి తమ సేవకుడుఫలానివాడు
అనేక శిరస్సాష్టాంగ నమస్కారములు చేసిచే
యంగలవిన్నపములుతక్కినవిసమానములు.

పుత్రాదులుతండ్రి

మొదలైనవారికివ్రాయుక్రమం.

శ్రీమద్యజనవేదమూర్తులైనతండ్రిగారిదివ్య శ్రీ
చరణారవిందములసన్నిధికి బాలకుడుతప్ప

త్రుఁడు ఫలానివాఁడు నిత్యము తక్కినవి పూర్వవ
త్తుగానే వ్రాయవలెను.

అల్లుండ్రు మొదలయినవారు వ్రాయునపుడు
తండ్రిగారు అనేమాటకుబదులుగా వర్యావుగా
రిదివ్య శ్రీచరణారవిందముల సన్నిధికి అనియు
బాలకుడుతమఅల్లుడు ఫలానివాడనియు వ్రాయ
వలెను.

మీదజెప్పిన స్వార్తులకువ్రాయుక్రమమేమ
ధ్యులకును ఉపయోగించుకొనవలసినది.

వైష్ణవులు పరస్పరమును వ్రాసుకొనుక్రమము.

ఉత్తమతక్షము.

శ్రీమద్వేదమార్గ। ప్రతిష్ఠాతనాచార్యోభయ
వేదాంతప్రవర్తకులైనశాంతశమదమాద్యనంతక
ల్యాణ గుణపరిపూర్ణులైన అస్మత్స్వామ్యులై అడి
యేనికిప్రాప్య ప్రాపకభూతులైవేంచేసి యుండే
శ్రీవారి ఫలానివారికి తిరువడి తామరలసన్నిధికి
దాసన్ దాసాను దాసన్ చరవరావదిదాసన్ ఫలా
నివాడు తాళుం తడక్క యుంకరాప్పిఅనంత

దండములు సమర్పించి వ్రాసికొనే విన్నపము ఇ
చ్చట ఫలానిదినము వరకు దాసవర్గములలో క్షేమ
ము. అచ్చట దేవరవారల ఉభయవేదాంత భాష్య
భగవద్విషయగ్రంథకాల క్షేపాతిశయములకు
సూత్రముఖంకృపచేయుకర్తలు.

మీరు వ్రాయునెడల నంతయు తన్ను జెప్పే ఉ
త్తమపురుష వాచకము నెల్ల అడియేననియు యె
దటివారి విషయించి చెప్పే మధ్యమపురుషవాచక శ
బ్దములనెల్ల దేవరవారనియు సందర్భానుకూల
ముగా వ్రాయవలెను.

మధ్యమపక్షము

వైష్ణవులకు స్మార్తులకుతక్రానవాడు.

వ్రాయుక్రమం.

శ్రీమద్వేదమార్గప్రవర్తకులైనఫలానివారికి ఫలా
నివారు నమస్కారములుచేసి చేయంగలవిన్న
పములు తక్రానంతయు స్మార్తులు పరస్పరము
నువ్రాసికొనుతిరునమే వ్రాయవలెను.

శిశువులు వ్రాయునెడలనమస్కారములు

అనుపిరాటకు బదులుగా రెండమ్ములసి వ్రాయడ
ముశప్పతకర్రనవి సమానమేను.

ఇదిగాక శంకరాచార్యులు మొదలైన ఆచా
ర్యసన్నిధులకును పవ్వేతసంస్థానములకును వ్రా
సేయెడల వారివారి బిరుదులకు తెలిపేపరాటలను
విచారించి వ్రాయవలెను.

కలెక్టరు జడ్జీలు ప్రభువులకు వ్రాయుక్రమము.

మహారాజ రాజశ్రీ ఫలాని దేశమునకు ప్రిన్సి
పాల్ కలెక్టరువుద్యోగస్థులగు ఫలానివారి సముఖ
మునకు యిదేశీయ సమస్తమైన దొరలకున్న వా
రివారి ఉద్యోగములను తెలిపి వ్రాయవలెను.



భూగోళవిషయము.

భూగోళశాస్త్రముఅనగా భూతలమున క
నబడెడు దేశ సముద్రాదులను వివరించునది వె
లగపండువలె గుండ్రముగావున్న భూమియొం
కర్ర పైభాగము మూడంపాళ్లు నీళ్లుగలిగి ఒకర్ర
పాలుఅగుపడుచున్నది. భూమి - ఏష్యా- యూ

రోపు-ఆఫ్రికా- ఒసినియా- అమెరికా -అనిఖం
డములు ఐదు. మొదటినాలుగు పూర్వార్థగోళ
మున - తక్కినది పశ్చిమార్థగోళమునఉన్నవి
ఏషియా ఖండము 6700 మైళ్లు పొడవును. 5400
మైళ్లవెడల్పు జనసంఖ్య 82 కోట్లు-దేశములు ర
ష్యా - చీనారాష్ట్రము - జపాన్-తూర్పిండియా
హిందూస్థానము-ఆఫ్గనిస్థానము - బెలూచిస్థా
నము-పారసీకము - తార్తారము - తురుష్కము-
యనునవి హిందూస్థానము 1900 మైళ్లనిడివి
యు 1500 మైళ్లవెడల్పు జనసంఖ్య 18 కోట్లు-
ఇదిమిక్కిలి ఘనతనొందిన విక్టోరియా చక్ర
వర్తిని యొక్కపాలనకు లోబడి-బంగాళమం
మదరాసు బొంబాయి అనుమూడుప్రధానరా
ష్ట్రములుగా విభజింపబడియున్నది.

మదరాసు రాష్ట్రము హిందూదేశమునకు ద
క్షిణభాగము ఇది దాదాపుగా దక్షిణహిందూ
స్థానమంతయునక్కనులోనియుత్తరసర్కారు
లు కలిసిన రాష్ట్రము జనసంఖ్య 31200000

ఇంతు ఆంగ్లేయుల పాలనకు లోఁబడిన దేశము ఇరువదియొకజిల్లాలుగా విభజింపబడియున్నది. గంజము-విశాఖపట్టణము-గోదావరి - కృష్ణ- నెల్లూరు-చెన్నపట్టణము - చెంగల్పట్టు-గుండలరూరు-తంజావూరు-మధుర-తిరునెల్వేలి - మళయాళము-దక్షిణకన్నడము-కర్నూలు-బళ్లారి - కడప చిత్తూరు- సేలము- తిరుచినాపల్లి-కోయంబత్తూరు- అనునవి జిల్లా అనఁగాక లెక్టరు నధికారము క్రింది దేశము వీనిలో పదునొకండు జిల్లాలు తూర్పుసముద్రతీరమునను రెండుపడమటిసముద్రతీరమునను యెనిమిది మధ్యనున్నవి ఈజిల్లాలలో అచ్చటచ్చట పెక్కుజమీనులునుగలవు ఇందు ఆంగ్లేయులచే సంరక్షింపఁబడిన ఆయాస్వదేశసంస్థానములును చేరియున్నవి. మైసూరు-తిరువాన్కూరు కొచ్చి-పుదుకోట - కొడగు - జయపురము అనునవి గొండలు పశ్చిమ సముద్రతీరమున పడమటి కనములును తూర్పు తీరమున తూర్పు కనములును సేలముజిల్లాలో సేరువరా

యకొండయును కోయంబుత్తూరు జిల్లాయం
దు నీలగిరియును మధురజిల్లాయందు పళణికొం
డయునుగలవు.

నదులు—గోదావరి-కృష్ణ-ఉత్తరపినాకిని-పా
లేరు- దక్షిణపినాకిని-కావేరి-వైగై- తామ్రపర్ణి
యివి యన్నియు పశ్చిమమునబుట్టి తూర్పుము
ఖముగాఁబ్రవహించి బంగాళా అఖాతమున క
లియును. వీనిలో గొన్నింటికి ఉపనదులుగ-వ
ర్ధ-వైనగంగ- పెనగంగ -మంజీర-యివిగోదా
వరియందును తుంగభద్ర ఘటప్రభ మలప్రభ -భీమ
వరద - ఇవి కృష్ణానదియందును శెయ్యేరు- ఇది
పాలేటియందును భవాని అమరావతినొయ్యల్
ఇవికావేరియందును గలియు ఉపనదులు-

మదరాస్ రాష్ట్రమునకంతకు రాజధానియైన
మదరాసును చెన్నపట్టణమని చెప్పుదురు ఈజిల్లా
నిడివి 10 మైళ్లువెడల్పు 4 మైళ్లు విస్తీర్ణము30
చదరపు మైళ్లు జనసంఖ్య సుమారు 400000
యిందలి గ్రామములను నగరవిచారణాధికా

రహ. యేర్పాటుప్రకారము 8 డివిజనులుగ విభజింపబడియున్నది. 1-డివిజను తండియార్పేట-ఛాకలపేట-రాయపురము-- కాశిబంగ్గ. 2-డివిజను-పెద్దినాయునిపేట పెద్దవరాలపల్లె - జమరాతోట. 3 డివిజను ముత్యాలపేట-అట్టెపాళెము కోట 4- డివిజను- వెపంబరాయి-వేసరవాడ. 5-డివిజను-చరాళ-పొరశవాకము-పెద్దమెట్టు-వేపేరి కొత్త పేట-ఎళంబరాయి-కోమలేశ్వరపురము. 6-డివిజను కిల్పాకము- సేతుపట్టు- నుంగంబాకము - మక్కాతోట. 7-డివిజనుపుదుపాకము-చింతాద్రిపేట నరసింగపురము - తిరుపల్లికేని - తిరువటేశ్వరునిపేట 8-డివిజను- మైలాపూరు - ఆళ్వారుపేట-రాయపేట-మీర్సాపేటకృష్ణాంపేట-తెనాంపేట.

ఇను.దారులు—చెన్నపురిని రెండు ఇనుపదారులుగలవు. అందొకటికి చెన్నపురి ఇను. దారియని పేరు. హిందువులు వాడుచున్నారు. హారాణులు దీనికేమ.నరాస్రెయిల్వేయని చెప్పపడుచున్నారు.ఇది చెంగల్పట్టు-చిత్తూరు- సేలము-కోయం

బుత్తూరు. జిల్లాలమీదపోయి మళయాళము జిల్లాపడమటి సముద్రతీరమందుండు బేపూరు చేరును. దీనికిని 197 మైళ్లు ఇందలి శాఖలు అరకోణమునుండి ఒకటి కంచిచేరును మఱియొకటి కడప జిల్లామీదుగా బొంబాయికి పోవును జోలారుపేటనుండి ఒకటి బెంగళూరు చేరుచున్నవి. ఈరోడ్డునుండి మఱియొక శాఖ తిరుచినాపల్లి తంజావూరు దారిగా తూర్పుసముద్రతీరమగు నాగపట్టణము చేరుచున్నది. మఱియొకటికి దక్షిణఇండియా ఇనుపదారి. యని హిందువులువాడెదరు ఇంగ్లీషువారు దీనినే సవుతు యిండియా రెయిల్వే యని చెప్పెదరు ఇది చెంగల్పట్టు- గూడలూరు-తంజావూరు-తిరుచినాపల్లి మధురలమీదపోయి తిరునెల్వేలిజిల్లాలో సముద్రతీరమందుండు తూతుకుడిచేరును యిందు చెంగల్పట్టునుండి ఒక శాఖకంచి చేరుచున్నవి.



1639-వ సంవత్సరము యింగ్లీషువారు వర్తకక
మునకొఱకు ఈప్రదేశమును ఒకస్వదేశపు చిన్న
రాజువద్ద వెలకు దీసుకొని తమసరుకుల
ను కాపాడుకొనుటకు ఫోర్టు సెంటు
జార్జి అను ఒకకోటను కట్టినారు. అక్కాల
మున యిచ్చటి సెంబతోం పరంవాసము చేరియుం
డిన ఒక చిన్న గ్రామముండెను. దానికి మదరాసు
అని పేరు నానాటు ఆకోటకు చుట్టుపట్ల పెద్దపట్ట
ణముకలిగినది. అప్పుడున్న జిల్లానాయకుడు
చెన్నప్ప అనుతండ్రి పేరు ఆపట్టణమునకు బె
ట్టించెను ఈపట్టణమందు దీనితోచేరినపేటలయం
దును 7 లక్షలజనముకలరు కోటకు దక్షిణము 8
మైళ్లదూరమున ఉన్న పరంగికొండ. అని హిం
దువులు జెప్పెదరు. దీనికేగవర్నమెంటువారు సెం
ట్ తామస్ మౌంటు యని జెప్పుచున్నారు మద
రాసుపిరంగి పట్టాలమునకు ముఖ్యస్థానము. పల్లా
వరము పూందమల్లి. ఇందు బ్రిటిషువారి సేనాస్థా
నములు పూర్వము ఉలాందావారి దైన ప్రదేశ

కావేరి - ఆవేరి - చేవరంగుమడుంగులోని లంక
యయున్నది. ప్రళయకావేరికి పడమట రెండుదిన
ముల ప్రయాణములలో నగరికొండలు గలవు
ఆర్కాటు నవాబువలన కంపెనివారు జాగీరు
గా సంపాదించిన చెంగల్పట్టుజిల్లా యిప్పుడు
మదరాసుతో చేరయున్నది కాంచీపురము చో
ళమండలమునకు రాజదాని యిది విష్ణుకంచి శివ
కంచి అని రెండుభాగములు కోవళమున చద
రంగపట్టణము పూర్వము డచ్చివారిది దీనికు త్త
రము 5 మైళ్లదూరమున పాడుపడియున్న మ
హాబలిపురమును బ్రాహ్మణ అగ్రహారమున్నది
దీనిదగ్గర పూర్వము మహాపట్టణమై యిప్పుడు
సముద్రమున పాడుపడియున్న సప్తాలయస్థా
నము ఒకటికలదని చెప్పుదురు.

పెద్దబాలశిక్ష - సంపూర్ణము.

